'నను సరిపోల్చుకోఁగలిగినావె లతాంగి!' యటంచు బల్కినన్
'విను మటువంటి పాపిని కపింజల! కాను, సుహృజ్జనంబులన్
గోనకొని కాదటండ్రె? యదికూడునె? యెవ్విధి నీటమున్గి? తె
వ్వని దయ పూర్వరూప మది వచ్చెను నీకు? వచింపగోరుదున్.

పుండరీకు డెందు నుండెడు వాఁడయ్య?
వాని విడిచి యొంటి వచ్చితేల?
వినదలంతు సర్వవృత్తాంత' మనియన్న
తరుణి కిట్లు బలికె తపసినుతుడు.

'విను మిటనొంటి నిన్ విడిచిపెట్టి వియచ్చరు చాలదవ్వు నే
ననుసరణమ్ము జేసితి, వియత్పథగామియుఁ బుండరీకునిన్
గొనిచని చంద్రలోకమునకున్ శశికాంత మనోజ్ఞశయ్యపై
నునిచె తదీయదేహము మహోదయనామ సభాంతరస్థలిన్.

"హిమకరు డౌట నే నెఱుగుమింక కపింజల! నీ సఖుండు జీ
వములను కామదోషమునఁబాయుచు శాపము నాకొసంగె కో
పమున 'దురాత్మ! పుట్టుమిక భారతవర్షమునన్ ప్రియాసమా
గమ సుఖహీనతన్ బరగి, క్రమ్మరఁగ్రమ్మరఁబుట్టుమా' యనెన్

నిరపరాధి కిట్టి నిరుపమశాపమ్ము
నీ సఖుండు నీయ నేను కినిసి
'నన్ను వోలె నీవు నా కష్టసుఖముల
బాలుగొందు' వంచుఁ బల్కి పిదప

అమ్మహాశ్వేత యందు నాకైన ప్రీతి
హితము సేతునుగాక నే నితనికంచు
మర్త్యలోకమ్మునం దినుమూరుమాత్ర
మితఁడు నాతోడఁ బుట్ట శపించినాఁడ.

నాశ మందరాదు లేశమైనను గూడ
నితని తనువు శాప మెడయు వరకు
కాన మామకీనకాంతి పోషితుఁజేయ
దెచ్చియుంటి నిందు నిచ్చకొలది.

శ్వేతకేతు మునికి చెప్పు మీ వృత్తాంత
మతఁడు ప్రతివిధాన మాచరింప
జాలువాఁడు గాన సత్వరం బేగుమం”
చతఁడు పలికి నన్ను ననిచి నంత

నే నతిదుఃఖ వేగమున నింగినిఁ బోవుచుఁ గానగొక్క వై
మానికు దాటియుం జనెడిమాడ్కి కతండు ‘తురంగమంబవై
మానవలోక మందు నభిమానము వాయ జనింపు’మంచు లో
నూనిన కిన్క శాపమిడ నుమ్మలికంబును జెంది పిమ్మటన్.

‘శోకపరీతచిత్తుడను చూడక చేసితి తప్పు, ఖేచరే
శా! కరుణించి శాప ముపసంహరణం బొనరింపు’ మన్న ‘నా
వాకు లమోఘముల్ గనుక వారుపవచ్చాటది తప్పనేర’ దం
చే కరణిన్ వచించె నుదయించిన నించుక జాలి నాపయిన్.

'ఎవని వాహనంబ వీవౌచు జనియింతు
వతఁడు మృతినిఁ జెంది నంత నీవు
జలములందుఁ గ్రుంక శాపవిముక్తియు
గలుగు నని వచించి పలికె వెండి

అనపత్యతాతాపమునఁ గుంది పొసరించు
నుజ్జయినీశ్వరుం డుగ్రతపము
ఆశేని తనయుఁడై యవతరింపగఁ బోవు
నుడురాజు ప్రజలెల్ల నుల్లసిల్ల

శుకనాసమంత్రికి సుతుఁడౌచు జనియించు
నీ కూర్చు చెలి పుండరీకు డింక
ఆ రాజచంద్రకుమార వాహన మౌచు
నుదయించి సుఖము లొందెదవుగాక!'

అనుట వినియు సధఃస్థిత మైన యుదధిఁ
బడియు నందుండి తురగరూపంబు దాల్చి
వెలికి వచ్చితి, హయరూప మలరుచున్న
పూర్వజన్మ సంస్మృతి యది పొలియ దనిస

'త్వత్సమేత యగుచు సత్రలేఖాంగస
సరసి మునిగి యెట్టి చందమయ్యో?
కరుణ దెలుపు' మన్న కాదంబరికి నంత
వినిచె నిట్లు లా కపింజలుండు.

' తరుణీ జలపాతానం
తరచరితం బెలుగ నేను తత్కథ లెల్లన్
అరయంగఁగోరి యిప్పుడ
సురముని యగు శ్వేతకేతుఁ జూడం జనుదున్.

అధిపసూనుఁ డెందు నవతరించిన వాఁడో
మంత్రితనయుఁ డెందు మసలు వాఁడో
పత్రలేఖ యెందుఁ బరగునో తెలియంగ
పోదు మాని పాదమూలమునకు '

అని వచించి యాతఁ డంబరవీథిపై
నెగిరిపోయినంతనే లతాంగి
అధిపసూను తనువు నన్యశిలాస్థలి
నొనర నిలిపె నెపద నోర్పుదాల్చి.

స్నానమొనరించి, దేవతార్చనము సేసి,
దినము నిశయు నిరాహారదీక్ష గడపి,
రాజపుత్రుని దేహమ్ము రమణి యుదయ
సమయ మంచుఁ బాణిసంస్పర్శ దేల్చి.

అంతటన్ గపింజలావేదితం బైన
' శాపవృత్తి మెల్ల సత్య మగుత !'
మనుచు నంతరాత్మ యంపు సంతుష్టయై
కూరుచుండె కుసుమకోమలాంగి.

పెద్దకాలంబు గతియించె ప్రియతనూజు
డేల రాడన్న యారాట మెడద గలుగఁ
దెలియ గాంక్షించి పంపె సందేశహరుల
తనయు వృత్తాంత మరయగా ధరణివిభుఁడు.

దళపతి మేఘనాథు గని తత్పరివారము గాంచి యంత న
య్యలఘుగుణాఢ్య 'భద్రముఖులార! కనుంగొనినారలొక్కొ మీ
యొడయనిమోము పూర్వమటులున్నదిగా, యికనేగి సత్యముం
దెలుపుడు మీకు సూచినది దేవర కంచు వచించి వెండియుం

త్వరితక నామధేయుఁ డగువానిఁ గుమారక బాలసేవకుం
'బరుగున వీరి వెంటజని పార్థివచంద్రుని తోడ సత్యపుం
తెర గెరిగించి ర'మ్మనుచు దేవి వచించిన వాఁడు పోయి, త
ద్ధరణిపు తోడ నిట్లని యథార్థకథాకథనంబు సల్పెడుం.

వసుమతీశ్వర! భయ మందవలదు, స్ఫుటిత
హృదయుఁ డయ్యును యువరాజు ధృతశరీరి.
శాపవశత చంద్రాపీడ సచివతనయు
లీ భవమ్ములఁ బడు వెత లింక వినుఁడు'

అని తదద్భుత చరితమ్ము నతఁడు వలుక
నిరవశేషంబుగా విని నెమ్మనమున
'నాకు జీవితసంధారణమ్ము సేయ
నందు జనుకంటె వేఱుపాయమ్ము లేదు'

అని తలంచి నృపతి ఆత్మీయకాంతతో
సచివుతోడ నతని సకియతోడ
నరిగి చేరె నంత నచ్ఛోద కాసార
మవిరతంబు లగు ప్రయాణములను.

అంతట వారిరాక విని హంసతనూభవ సిగ్గుచే గుహా
భ్యంతరసీమఁ జొచ్చె, మదిరాత్మజ మూర్ఛను జెందె, నట్లవ
స్థాంతరు లౌట వారు, సచివాగ్రణి భూరమణుల్, దదీయసీ
మంతిని రాజవల్లభఁ, గ్రమంబున నాశ్రమసీమఁ జేర్చినన్.

సర్వయత్నములను చాలించి సుప్తిని
జెందు వాని బోలి నందనుండు
నుర్వి వ్రాలియున్న నుజ్జీవితుం డంచు
దలఁచి యాశ్రమమున నిలిచె నృపతి.

'ఎవఁడు కామోపహతబుద్ధి నవినయప్ర
వర్తనముసేసి, దేవతాపదము వాసి;
జగతి శుకనాస సూనుఁడై జన్మ మెత్తె
వెండి యాతండె వ్యామోహవిగతబుద్ధి

కాఱు లాడినంత కనలి మహాశ్వేత
శాప మిడిన కీరజాతిఁ బుట్టె'
అని వచించువేళ మునిరాజు జాబాలి
అఖిలకళలు నిల్చె నాత్మ రసన !

పొలిచినంత రసన పూర్వజన్మోపాత్త
సర్వవిద్య లట్లు జనన మందె
హంసుతనయ యందు నైన రాగాదిక
స్మరణ లెల్ల నాదు స్వాంతసీమ !

'రసపారవశ్య బలమున
నిసి గడచుట లగ్ని వేళ నెఱి పొడముట లా
కస మందు నినుఁడు దోఁచుట
లిసుమంతయు నెఱుఁగ' నంచు ఋషి లేచి చనెన్

ఆ కపింజలుండు హారీత సహితుఁడై
యరుగుదేరఁ జూచి యతనితోడ
'కుశలమున్నె తండ్రి ? కుపితుండె ? నావృత్త
మెరిగి యేమి బలికె గురు' డటన్న.

'అనుగుచెలిమికాడ ! అఖిలవృత్తాంతంబు
దివ్యదృష్టి వలనఁ దెలిసి గురుఁడు
ప్రతివిధానకర్మ ప్రారంభమును జేసె
తురగభావ మంత తొలగె నాకు !

అంత సురమునీంద్రు న్నాశ్రమ వాసినై
యున్న నన్ను నేటి యుదయవేళ
చనవు మీరఁ బిల్చి "జాబాలి యాశ్రమ
వాసి యైన వాఁడు నీ సఖుండు

పొడమె వాని కిపుడు పూర్వజన్మస్మృతి
యందువలన నరిగి యరసి వాని
నస్మదీయమైన యాశీస్సు లందిచ్చి
తెలుపు మయ్య నాదు పలుకు లిట్లు.

'కర్మపరిసమాప్తి కల్గునందాక జా
బాలి యాశ్రమంబు వదల జనదు'
అని వచించె గురుఁడు నంబయు నీ మీది
నెనరు చేత మిగుల వనట జెందె.

దైవముని యొనర్చు తత్కర్మయం దుప
జీవినీ ప్రవృత్తి సెలఁగు చుండి
ఆమె నీదు మూర్ధ మాఘ్రాణమును జేసి
పదియుఁబదిగ నాకు నదె వచించె'

వచనకరుఁడు వినయపరుఁడు మహాత్ముఁడు
బహుకృతజ్ఞబుద్ధి పరమశాంతుఁ
డటు వచించి యప్పు డంతరిక్షంబుపై
నెగిరిపోయె నా కదృశ్యుఁ డగుచు.

కతిపయ దివసములకు ను
త్పతనము గావించు శక్తి వచ్చిన గౌరీ
సుతుఁ బోయి జూతుఁగాకని
యతులిత సమ్మోహనిశ్చయాత్ముఁడ నగుచున్.

పరమకౌతుకమున ప్రాతర్విహారంబు
వ్యోమవీథి సలుపు చొక్కనాఁడు
నుత్తరాశఁ బట్టి యొకకొంత దవ్వేగి
యలసి విశ్రమించి యరుగ నెంచి.

కొలని యొడ్డునందు జెలువొందుచున్నట్టి
యవనిజాగ్ర మొందు నాశ్రయించి
యలపు సెందియుంట నట్టె నిద్దురపట్టి
చాలకాలమునకు మేలుకొంటి.

అరసినాఁడ నంత నాత్మదేహము తంతు
పాశబద్ధ మగుట, పాశరహిత
కాలభటుని వోలి క్రాలెడు నొక్క చం
డాలమృగయు నాదు మ్రోలఁ గంటి.

పక్కణంబునకును వాఁడు గైకొనిపోయి
చూపె నన్ను నొక్క సుందరాంగి
కామె 'ప్రాప్తమైతివా పుత్రకా!' యంచు
నగుమొగమ్ముతోడ నన్నుఁ బలికె.

దారుపంజరమునఁ జేరిచి నన్నంత
గడియవైచి, యొక్క గడియసేపు
మౌనమూనె నామె, ప్రాణపరిత్యాగ
బుద్ధి పొడమి మౌనముద్రఁ గొంటి.

ఉపవసించినాఁడ నుపనీతపానాశ
నమ్ము లించుకేని నాఁడుఁ గొనక,
అపరదివస మందు నశనకాలము మించి
పోవుచున్న వేళ నా వెలంది.

సురభి సుశీతలోదకము సొంపగు పండ్లను దెచ్చి 'ఎందుకీ
నిరశనదీక్ష గ్రుంగెదవు నీ వవిచారత ? క్షుత్పిపాసలన్
దొరకిన దాన దీర్చుకొని తుష్టిగొనున్ బశుపక్షివర్గ మి
త్తెరగున వానికిన్ బలుపుతిండి లభించునె కాంక్ష సేసినన్ !'

సాదరోక్తు లిట్టు లాయమ్మ వచియింప
విస్మితాత్ముఁడను వివేకి నగుచు
నడప క్షుత్పిపాస లాహారముం గొని
మాననైతి నాదు మౌనవృత్తి !

అరిగిన కొన్నినాళ్లటుల నంతట నొక్కదినంబునందు భా
స్కరుడుదయింప మేల్కొనుచు గాంచితి గాంచనపంజరంబులో
వరలుట నేను, అందమగు పట్టణముం గని 'ఏమిటంచు త
త్తరము కుతూహలమ్ము పడి తద్గతి నారయ మౌనవృత్తినై.

కువలయనాథ ! మీ కొలువుకూటము సేర్చిన దంత సన్ను నీ
కువలయనేత్ర, దీని కత కొంచె మెఱుంగను, ఎందుకోస మీ
ప్రవిమల మంగళాంగి నను బంధితుఁ జేయుచు నింపు దెచ్చెనో
అవగతమింత కాదు విదిశాధిప !' యంచు శుకమ్ము వల్కెనన్.

అది విని శూద్రకేశ్వరుడు హర్షకుతూహల మానసుండునై
మదవతి తోడి తెమ్మనిన మాత్రన తెచ్చెను సేవకుండు న
మ్ముదితయు 'వింటివే! భువనభూషణ! భూపతి! రోహిణీపతీ!
కథనము సేయ వీఁడు తనగాథ భవత్కథ నింపు పుట్టగన్.

ఇతని కేను జనని నిందిరాదేవిని
ఈ భవమ్మునందు నితఁడు మరల
వలపులాడి కొరకుఁ బయనమ్ము సేయంగ
దివ్యదృష్టి నరసి దేవమునియు.

'వినయహీను డెప్పు డనుతాప మొందక
తొలగ నేర డతని దోసగు నుండి
కర్మపరిసమాప్తి కల్గెడు నందాక
సాకు మితని మర్త్యలోక మందె!

అనుతాపము సెందిన తత్
క్షణమున విడువంగవలయు గమలా!' యనుచున్
నను బనుపుసేసె వీనిని
వినిబద్ధు నొనర్చియుంటి వినయము గఱపన్!

శాపావసాన సమయము
ప్రాపించెను వీని కర్మ పరిపూర్తి గనన్
భూపాలచంద్ర! మీరలు
శాపానంతరము నందు సమసుఖవంతుల్!

త్వత్సమీపమునకు తత్కారణమ్ముచే
వీనిఁ దెచ్చియుంటి మానవేంద్ర !
జగతిఁ దొలఁగియుండఁ జండాలజాతిలో
ప్రభవ మంది యుంటి ప్రభువతంస !

జనన మరణ జరావ్యాధి సంయుతములు
దుఃఖబహుళ దేహంబులఁ దొఱఁగి మీర
లిష్టజన సమాగమసుఖం బింక ననుభ
వింపు'డని చెప్పి సుకతి ద్యోవీధిఁ జనియె.

పూర్వజన్మమందుఁ బుడమిపై బడియున్న
తనదు తనువు గూర్చి తలచి నంత
కాయ మెల్లఁ గాల్చి కామానలంబును
అవనిపతి యెడంద రవులజొచ్చె !

పుండరీకాత్మయా మంత్రిపుత్రు డంత
గౌరిసుత యందు గల్గు నుత్కంఠ వలస
నవనిపతి వోలె నా రతీధవుని చేత
నింతయని చెప్పగారాని యిడుమ నందె.

సురభిమాసమ్ము సనుదెంచె, సుమచయమ్ము
పరిమళమ్ముల విరజిమ్మె; నిరుపమాన
సుందరము లౌచు సుమలతల్ కందళించె
ప్రేమమయ మౌచు దోచె ధాత్రీలలామ!

ఆ మధుమాస శోభలకు నాకులపాటును జెంద డెందమున్
కోమలగాత్ర చిత్రరథు కూతురు కొండొక సందె జామునన్
ప్రేమభరమ్ముచే విభుని గ్రీవము గట్టిగఁ గౌఁగిలింప తత్
స్వామి సచేతనుం డగుచు చందనగంధికిఁ బ్రీతి నిట్లనున్.

'భయము నెందవలదు పంకేరుహాననా!
కంఠసీమ నీవు గౌఁగిలింప
మఱల బ్రతికినాడ మగువ! రెండవసారి
విగతశాపవృత్తి వెలసె దీన.

శూద్రకాఖ్య తనువు సుందరీ! విడనాడి
నీకుఁ బ్రియము నైన నృపకుమార
మూర్తి దాల్చినాడ ముదిత! హంసాత్మజా
వల్లభుండు శాపవర్జితుండు'

అని వచించి చంద్రాపీడు తనువు నందు
చంద్రముడు నిల్చె, నంతరిక్షంబు నుండి
ఆ కపింజలు కరమునం దాత్మపాణి
పుండరీకుండు గీలించి పుడమిఁ జేరె!

హంస చిత్రరథుల నానందవారాశి
వీచు లందు దేల్చ వెడలె నంత
హేమకూటమునకు నెలమిఁ గేయూరక
దారకుండు వ్యోమచారి యగుచు.

మదలేఖ విలాసవతీ
పదముల పై నృపతి పాదపద్మంబుల పై
నుదురాన మ్రొక్కి 'దేవా !
బ్రదికెను యువరా జదృష్టవంతులు మీరల్ !'

అని వచింప నృపతి హర్షాంబునిధి దేలి
సుతుడు వెలయుచున్న చోటి కరుగ
జనక చరణసరసిజముల చంద్రాపీడు
డొఱగి మెఱగె భక్తిపరవశమున.

చెలువుమీర శిరము చెక్కిలి ముద్దాడి
చుంబనంబు చేసి సుతుని నుదురు
బిగ్గగౌఁగిలించి ప్రియనందనునిఁ దేల్చె
లాలనముల నవ్విలాసవతియు !

మంత్రివర్యుఁడైన మహనీయు శుకనాసు
మరల మరల మ్రొక్కె మహిపసుతుఁడు
పుండరీకుఁ జూపి భూనాథపుత్రుండు
ధరణిపతికి సచివదంపతులకు.

'మన వైశంపాయను డిత'
డని చెప్పిన సంతసించి రందఱు మదిలో
క్షణమట్లు గడచె నమ్మెయి
ననుకొనకయె నాటిరేయి యది వారలకున్.

ఆ తొలిసంజవేళ కట హంసుఁడు చిత్రరథుండు జేరి, త
చ్చేతము లుల్లసిల్లగ విశిష్టసమస్త కథానులాప సం
భూతమహోత్సవంబులను బ్రొద్దులఁబుచ్చిరి మంత్రివర్యుఁడున్
భూతలనాథుఁడున్ దమకు భూరిసమాదరణమ్ము జూపగన్.

క్షితిపతనూజు తోడుకొని చిత్రరథుండును హేమకూట మం
చితగతిఁ జేరి సంతసము చెల్వము మీరగఁ బెండ్లి జేసె త
త్సుతకును రాజపుత్రునకు సుందరి డెందము గందళింప, రా
జ్యతరుణిఁ గూడ కాన్కయిడె నల్లునకున్ బరమాదరమ్మునన్:

ఆతరి వేడ్కమీరగ వియచ్చరనాథుఁడు హంసుఁ డమ్మహా
శ్వేతకు బుండరీకునకుఁ బెండిలిఁ జేసె మహోత్సవమ్మునన్
ప్రీతి స్వకీయ రాజ్యపదవీ రమణీయ సువర్ణపీఠి జా
మాతృ వశమ్ముఁ జేసె గుణమంజులు డాతఁడు తృప్తచిత్తుడై:

కడు విషణ్ణ యగుచు కాదంబరీదేవి
నాథు వదన మొక్కనాడు జూచి
'ఆర్యపుత్ర ! ఎచట నా వరాకి చరించు
పత్రలేఖ కంటఁబడ 'దటన్న.

'రోహిణీ లతాంగి మోహినీ! ఆ లేమ
చంద్రలోక మందు సంచరించు
శాపగతుని నన్ను సంసేవనము సేయ
పత్రలేఖ యగుచు ప్రభవ మందె.

ఇచట మరల నేను నింకొక్క జన్మంబు
నందవలసి యామె త్యక్త యయ్యొ,
చంద్రలోక మేగి చరియించు నయ్యంతిఁ
జూడవచ్చు నచట సుదతి!' అనియె.

శ్వశురగృహము నందు దశరాత్రములు నిల్చి
నృపకుమారు డంత నిజపురమ్ము
చేరి రాజ్యలక్ష్మి చెలి పుండరీకున
కప్పనంబుఁ జేసె నొప్పు మీర!

ఉజ్జయినీవాస మొనరించు కొన్నాళ్లు
ఆత్మీయదేశమం దైనరక్తి
హేమకూటంబునం దెసలారు కొన్నాళ్లు
గంధర్వరాజుపై గలుగు ప్రీతి

చంద్రలోకమునందు చరియించు కొన్నాళ్లు
రోహిణీరూప ప్రలోభ బుద్ధి
అచ్ఛోద సీమయం దలరారు కొన్నాళ్లు
పుండరీకుని యందు పొసగు మైత్రి

సుందరములైన యాయాయిచోటు లందు
నెల్లవేళల సంప్రీతి యెసక మెసఁగ
రమ్యకాదంబరీ చిరప్రణయమధుర
పాశబద్ధుఁడై మెలఁగు పృథ్వీశసుతుడు.

చంద్రాపీడుఁడుఁ బుండరీకుఁడు విలాసప్రేమమాధుర్య ని
స్తంద్రుల్ పొందిరి సర్వసౌఖ్యములు, శశ్వత్సాధు కాదంబరీ
సాంద్రప్రేమము హంసరాజతనయా సాంగత్యసంప్రాప్తి రా
జేంద్రత్వమ్ము పరస్పరావిరతియుఁ హేలాగతిఁ గొల్వఁగ !

*

THE INDIAN P. E. N.
October 1, 1944

KADAMBARI : by A. Naga Gopala Rao. Second Edn.

The famous poet Bana's well-known work in Sanskrit is here presented in an admirably condensed and readable manner. Eschewing the lengthy descriptive details of the original, Shri Naga Gopala Rao has confined himself to the essentials of the story. He has succeeded in retaining in his work the spirit of the illustrious original and this is indeed an achievement. Gifted with a facile pen, he has imparted to his verses smoothness, sweetness and simplicity. I have immensely enjoyed reading the book, and congratulate the young author on his creditable performance of a difficult task.

K. V. GOPALASWAMY Esq., M.A. (Oxon)
Barrister-at-Law, Registrar, Andhra University

Thanks for Kadambari. It is excellent.

THE HINDU

May 17, 1942

Bana's Kadambari is a very well-known book in Sanskrit literature. The story has been so intricately woven and the descriptions have been so imaginatively and extensively spun out that Bana has earned a special reputation. 'Banochistam Jagatsarvam' has become a very popular saying The whole world (of literature) is but crumbs left at Bana's feast.

In the original this work is very extensive, covering hundreds of pages with its luxuriant description in a highly ornate style. Sri Naga Gopala Rao has practically omitted the descriptive portions and condensed the work into about a thousand lines of poetry. He has closely followed the original version of the story. His verse has a flow all its own and the style he employs is simple and easily understandable. This author does not eschew long-winded verse. But he has kept it at a minimum and employed quick short lines with great effect.

B. HANUMANTHA RAO Esq., B.Sc. (Engg) (Lond)

Your work is a welcome contribution to our literature. The poems are fluent and throbbing with melody.

THE MODERN REVIEW
May 1, 1942

KADAMBARI : by A. Naga Gopala Rao. Bezwada.

The above book is an excellent adaptation in Telugu Verse of Bana's original in Sanskrit. These poems are of fine artistic quality and have been treated in a compact and lucid form. In its modernity, the book enhances the elemental grandeur and the classical beauty of Bana. The get-up of the book is attractive and the poems contained in it form a very pleasant study.

S. V. SUBBA RAO Esq., B.Sc. (Hons) (Edin)

This compact and pleasant book contains some of the finest poems I have ever read.

ఆల్ ఇండియా రేడియో . మద్రాసు

14 . 3 . 1942

కా ద ం బ రి

రచయిత : అదేపల్లి నాగగోపాలరావు గారు, బెజవాడ. పద్యకావ్యము. డాక్టర్. సర్ కె. వి. రెడ్డినాయుడుగారికి కృతి ఇచ్చారు.

బాణుడు వ్రాసిన సంస్కృతగ్రంథమునకు ఇది తెలుగు అనువాదము. కథకు సంబంధించి జాగ్రత్తగా మూలమును అనుసరించియే ఈ కవి నడచినాడు. మూలమునందలి వర్ణనములు మున్నగువాటిని వదలి కథాసంగ్రహమును మాత్రము తెల్పుటకు కవి యత్నించెను.

కథాసరళి ఇంచు సులభముగ అవగాహనకు వచ్చుచున్నది. ఈ కవియు అచ్చటచ్చట వర్ణనల గావించెను. కాని అవి తగినంతగా ఉన్నందువలన కథనడకకు అడ్డురాలేదు.

రసపాత్రపోషణలు ఏలోటు రాకుండా జరిగినవి. మూలమును చదువకున్ననూ అందలి రసపరిపాకమును దీనివల్ల చాలవరకు పొందగలరు.

సామాన్యులకు సైతము అర్థమగు భాషను ఉపయోగించి పద్యధారకు ఆటంకము కలుగకుండ భావముల బట్టి మార్పులను గావించుకొనుచు కథను చక్కగ నడిపించినారు. కథలో పాత్రలను ప్రవేశపెట్టుటలో ఈ కవికి ప్రత్యేకత ఉంది. అసలు

గ్రంథమును ప్రారంభించుటలోనే ఈ ప్రత్యేకత గోచరమౌతుంది. ముందు పాత్రలచే మాట్లాడించి, కథ నడకతో పాత్ర, గుణములను తెల్పుతూ వచ్చారు.

అసలు కథానాయికను ప్రవేశపెట్టుటలో కవి ఒక క్రొత్త పంథాను త్రొక్కినారు. నాయికానాయకుల సంయోగఘట్టమును ఎంతో సహజంగా చిత్రించినారు.

అచ్చు ఆకతి ఆకర్షవంతంగా ఉంది. సారస్వతాభిమానులు మూల్యమునకు తగిన లాభమునే పొందగలరు.

గ్రంథ విమర్శ : పింగళి నాగేశ్వరరావు గారు.

ఆంధ్ర వారపత్రిక : మద్రాసు

20 . 8 . 1941

'కాదంబరీ రసజ్ఞులకు ఆహారంగూడా రుచించదు' అనే సూక్తికి పుట్టినిల్లైన కాదంబరి సంస్కృతములోని మేటి గ్రంథములలో నొకటి. దానిని పలువురు ఇంతకుమున్నే తెనిగించినారుకూడా. పెక్కు కృతులను కన్నవారూ, కొన్నవారూ అయిన శ్రీ నాగగోపాలరావు గారు నేడు సంగ్రహంగా చక్కగా అనువదించారు. భాషకు లొంగని బాణుని భావబాణాలు ఇతరభాషల్లో అతకటం అంటే ఉన్న కష్టం తెలిసిన వారు ఈ అనువాదాన్ని చులకన చెయ్యరు.

కృష్ణా పత్రిక . మచిలీపట్నము

20 . 3 . 1942

సత్కవిహృదయం ఒక చక్కని వీణవంటిది. ఆ కవి హృదయ మెంత గంభీరమో దాని స్వరమంతటి సొగసైనది. ఆ హృదయ మెంత శాంతమో ఆ స్వరమంతటి మధురమైనది. పిన్నవాడయ్యును నాగగోపాలరాయు డొక సత్కవి. చక్కని పండితుడు. కవిత్వమో రాయంచనడక వంటిది. ఈతడు 'కాదంబరి'ని తెలుగుసేతలో పైన సూచించిన మృదుసంపదల నన్నిటినీ కొల్లగొనినాడు.

భారతి . మద్రాసు

7 . 3 . 1942

బాణుడు సంస్కృతములో రచించిన కాదంబరికి ఇది తెలుగు అనువాదము, పద్యరూపము. మూలములోని అతి విస్తృత కథ వర్ణనముల నన్నిటిని మానుకొని ఇందులో సంగ్రహ రూపమును దాల్చినది. కథాసరళి ఇందులో సులభముగా అవగాహనకు వచ్చుచున్నది. పద్యధార పదిలముగానే యున్నది. మూలములోని భావములను అనువాదములోనికి తెచ్చుటకు అనువాదకులు చాల శ్రమించి యుండవలెను. భావములకు తగిన భాష ఈ పద్యములలో పట్టుపడినది. మూల గ్రంథమును చదువలేని వారికి అందలి రసపరిపాకము దీనివల్ల యథోచితముగా అవగాహన కాగలదని చెప్పవచ్చును.

విభూతి . సికింద్రాబాద

25 . 6 . 1942

మహాకవి బాణుని సుప్రసిద్ధమైన కాదంబరీ గ్రంథముయొక్క కథాసంగ్రహమునే శ్రీ అ. నా. గో. రావు గారు సులభమగు శైలిలో సూటిగ హృద్యములగు పద్యములతో నల్లి విద్యార్థిలోకమునకు ఉపకార మొనర్చినారు. కవితాధార కాఠిన్యాది దోషముల కతీతమై రావుగారి పరిష్కృతకళా లాలిత్యమునకు సాక్ష్యమును సంతరించుచున్నది. తెలుగు పొత్తములలో నింతటి ముద్రణాసౌందర్య సౌభాగ్యము లందినవి అరుదు. వీరి యెల్ల పుస్తకములందును ముద్రణాభినవ కళానైపుణ్యము మురిపెము కలిగించుచుండును. ఇది ప్రచార బాహుళ్యము నందుననుటలో సందియము లేదు. గ్రంథకర్త గారు అభివంద్యులు.

గృహలక్ష్మి . మద్రాసు

1 . 4 . 1942

కాదంబరి : ఆంధ్రీకర్త . శ్రీ అద్దేపల్లి నాగగోపాల రావు. బాణుని సంస్కృత మూలమునకు తెనుగున చక్కని అనువాదము. రసవంతమగు పద్యరచన. ముచ్చటయిన ప్రచురణము.

కళాప్రపూర్ణ . కవిసమ్రాట్

శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుం గారు

జయపురం

5 . 3 . 1942

శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావుగారు తెలుగు పద్యములతోడ సంక్షేపముగా ననువదించిన 'కాదంబరి' యందుఁ గల కొన్ని పద్యములను జదివితిని. అవి మృదుపదకలితములయి మనోహారములుగా నొప్పుటవలన నప్పొత్తము తెలుఁగు తెలియు వారి సమాదరణమును గాంచెడిని.

కళాప్రపూర్ణ . మహామహోపాధ్యాయ

తాతా సుబ్బారాయశాస్త్రి గారు . విజయనగరం

13 . 3 . 1942

తాము రచించిన యాంధ్ర కాదంబరిని జదివితిని. బాణుని కాదంబరిని చదివినపుడు నగ్ననాసక్కచిత్తులై కథాసందర్భము నేకాకారముగ గ్రహింపజాలక రసాస్వాదమును విలంబముగ బొందుచున్నారు. తాము రచించిన యీ కాదంబరిని చదివినచో పాఠకుల కట్టి శ్రమ యుండదని తలంచుచున్నాను.

కళాప్రపూర్ణ. మహామహోపాధ్యాయ

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు. రాజమహేంద్రవరము

11. 3. 1942

కాదంబరి సంస్కృతమున 'బాణోచ్ఛిష్టం జగత్సర్వ' మని ప్రసిద్ధి గాంచిన బాణ మహాకవిచే రచింపబడినది. దీనిని శ్రీమదద్దేపల్లి నాగగోపాలరావు గారాంధ్రీకరించి ప్రచురించిరి. గ్రంథముద్రణ మెట్లు ముద్దులు మూటగట్టుచున్నదో గ్రంథ నిర్మాణము గూడ నట్లున్న దను టతిశయోక్తి కాఁజాలదు. శ్రీ నాగగోపాలరావుగారి కవిత్వము నాతికఠిన మృదుమధుర శైలిం దగిలి పండితపామర హృదయ రంజకముగా నుండు ననియు నం దెట్టి దోషములు గానవచ్చుట లేదనియు మనవి చేయుచున్నాను.

మొదట నేనీ గ్రంథము చూచినంతలో నిం దాధునిక కవుల వ్యావహారికాది ప్రయోగము లుండునని తలంచితిని గాని గ్రంథము చదువ నారంభించినతోడ నాగగోపాలరావుగారు నవనాగరకులుగాఁ దోప నచ్చినను బూర్వాచారపరులం బోలి పూర్వ కవుల మార్గమునకు భిన్నమైన మార్గమునం బోయినవారు కారనియు వారి కవిత్వము సర్వజన సమాదరణీయం బగుననియు నభిప్రాయము కలవాడనై నాగగోపాలరావు గారి కితోధిక మహాగ్రంథములు రచించుచు ఆయురారోగ్యైశ్వర్యములు గలిగి వర్ధిల్లుచుందురుగాక యని కోరుచున్నాను.

కళాప్రపూర్ణ
శ్రీ త్రిపురాన వేంకట సూర్యప్రసాదరావుదొర వారు
శ్రీకాకుళము
29 - 11 - 1943

మీ కాదంబరి మూలక
థాకలనా సంగ్రహణ సమంచితరచనా
సౌకర్యధుర్యపద శ
య్యాకోమల పద్యహృద్యమై యలరారున్.

వెకిలి చూపు లేక నగటుఁదావులు లేక
పాటులేక భంగపాటు లేక
మనికిఁ బ్రమద మొసఁగు మంచి కాదంబరి
సంగ్రహించినావు సత్కవీంద్ర !

నీ కృతులకు భవత్కృపాస్వీకృతులగు
శ్రీ కృతులకును జిరతరస్థితి ఘటించి
యెల్లశుభముల గోపాలుఁ డిచ్చుఁగాక !
నాగగోపాల సుకవిపున్నాగ ! నీకు.

కళాప్రపూర్ణ . కావ్యస్మృతి తీర్థ

జనమంచి శేషాద్రిశర్మ గారు . కడప

16 . 1 . 1944

తమ రాదృతిమై నంచెదారి సనిపిన కాదంబరి చేరినది. తమ రచన బాణ కృత కాదంబరికి ఛాయవలె నున్నది. కాదంబరి కథ మీ యాంధ్రీకరణము సుబోధము చేయుచున్నది.

మీ కవిత్వ మిక్కాలపు లక్షణములం జొప్పించుకొనక ధారాశుద్ధి గలిగి పరమపావనమై యలరారుచున్నది.

ప్రాక్పుణ్య పరిణతింగాని శైలి మనోహరముగ నలవడ దని పెద్ద లందురు. అది సత్యమేయని మీ కవిత చాటుచున్నది. పద్యరచనయందు శ్రమపడిన విధము గానరాదు. మీ యీ కవిత్వము 'వీనుల విందై యమృతపు సోనల సొంపై' యున్నట్లున్నది. ఇట్టి మీ యీ కృతి సుకృతి గేయమై వెలయఁగల దని నమ్మెదను. తిక్కనాదుల శైలిం బోలియున్న మీ గ్రంథము సర్వతోముఖవ్యాప్తిం గాంచుగాత మని కోరెదను. సర్వేశ్వరుఁ డిట్టి యుత్కృష్ట గ్రంథరచనకు మిమ్ముఁ బురికొల్పి ధన్యుం జేయుఁగాక యని యాశించుచున్నాను. రసాస్వాదనమున సరసకవులు సంతృప్తులై మిమ్ము స్మరించుచుందురుగాక. మీ రాయురారోగ్య భాగ్యవంతులై చెలంగుదురుగాక !

కళాప్రపూర్ణ . శతావధాని
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు . కడియము
1 . 3 . 1942

భవద్విరచితమై సుష్ఠుముద్రితమై నాకడ కంపఁబడిన ఆంధ్ర కాదంబరి నేఁడు కార్యాంతరవ్యాప్తియున్నను ఏకదీక్షగాఁ జదివి ఆనందించితిని. సుకవిత్వమున కెన్ని యోగ్యత లుండవల యునో అన్నియును మీ రచన యందు గోచరించుచున్నవని వ్రాసినచో సూత్రప్రాయముగా మీ కవిత్వాభినందనము చేసి నట్లగు నని అంతమాత్రమే వ్రాసి ముగింతును.

పరమేశ్వరుఁడు మీ కింకను ఇట్టి సత్కావ్యరచనా కౌతూ హలము వృద్ధి నందించి ఆయురారోగ్య భాగ్యాదికము కటా క్షించి రక్షించుఁగాక యని ఆశీర్వదించుచున్నాఁడను. మఱియు మీ కృతిని విద్యాశాఖాధికారులకుఁ బంపుచో నెవరి యభిప్రాయములతోఁ గాని పనిలేకయే విద్యార్థులకు బాఠ్యగ్రంథముగా నియమింతురని నేను విశ్వసింతును.

విద్యాప్రవీణ
జమ్ములమడక మాధవరామశర్మ గారు . తెనాలి
6 . 8 . 1942

విశిష్ట యోగ్యతాభావనీయ మగు కాదంబరిని సుఖచర్వణీయ ముగ స్వాదువుగ చేసిన శ్రీ అద్దేపల్లి నాగగోపాలరాయుని అభినందించుచున్నాను.

కళాప్రపూర్ణ . సాహిత్యచక్రవర్తి
చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు . కాకరపర్రు
20 . 11 . 1943

మీరు దయతో నా కంపిన యాంధ్ర 'కాదంబరి' పద్యకావ్యమును జదివించుకొని వింటిని. కవిత్వము సరసమై సులభమై యున్నది. కాదంబరి నాంధ్రీకరించుట మిక్కిలి కష్టము. బాణ విరచితమైన మూలగ్రంథము బహుదీర్ఘసమాసముల తోడను, శ్లేషల తోడను, క్లిష్టపదములతోడను నిండియున్నది. అటువంటి సమాసములను శ్లేషలను విసర్జించి సర్వజన సుబోధక మగునట్లు మీరు తెనిగించుట శ్లాఘాపాత్రము. బాణుని కాదంబరి లోని కథాసందర్భము తెలిసికొనుటయే మిక్కిలి కష్టము. మీరు రచియించిన యాంధ్రకాదంబరి జదువుకొన్న వారికి దానిలోని కథాసందర్భమంతయు గరతలామలకముగ దెలియును. అందుచేత మీగ్రంథ మాంధ్రుల కుపయోగకరమైనది. రసగ్రహణపరాయణులైన యాంధ్రులు దీనిం జదివి, రసముంగ్రోలి యానందింతురుగాక! పరమేశ్వరుడు మీకు దీర్ఘాయురారోగ్యముల నిచ్చుగాక!

కాటూరి వేంకటేశ్వరరావు గారు . మచిలీపట్నం
6 . 7 . 1942

సరసకవితాధురంధరులైన శ్రీ నాగగోపాలరావు గారు కథాప్రధానముగా తెలిగించిన కాదంబరి అనే గ్రంథం వీనులవిందే కాక కనువిందు కూడా కూర్చింది.

ప్రభుత్వాంధ్రానువాదకులు

చెన్నాప్రగడ భానుమూర్తి గారు . భీమవరం

23 . 5 . 1942

శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావు గారి 'కాదంబరి' సాకల్యముగఁ జదివినాఁడను.

షేక్స్పియర్ మహాకవి యొక్క నాటకముల కథాంశము 'ల్యాంబ్సు టేల్సు' రూపమున సంగ్రహముగా వెలయింపఁ బడినట్లు, సంస్కృత మహాకవుల కృతుల యందలి కథాంశ మును సంక్షిప్తముగా తెనుగున అదియును ఛందోబద్ధముగా సర్వజనహృదయంగమ మగునట్లు రచించుట యెంతయు దుర్ఘటమైన కార్యము. ఇట్టిపనిని సఫలముగా నిర్వహించుటకు అసాధారణ ప్రతిభయు పరిశ్రమయు గావలసియున్నవి. ఇట్టిపనికిఁ బూని ప్రథమప్రయత్నముననే ఇంత సాఫల్యము గాంచిన నాగగోపాలరావు గారెంతయుఁ బ్రశంసాపాత్రులు.

అభినవవాగనుశాసన

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు . ధవళేశ్వరం

22 . 7 . 1942

బాణ కాదంబరీ కథాభావమునకు
నద్ద మనఁగ స్వతంత్రకావ్యం బనంగ
నాగగోపాలు కవిత విన్నాణ మగుచుఁ
బద్య కాదంబరీకృతి పరిఢవిల్లు.

శతావధాని

వేలూరి శివరామశాస్త్రి గారు . సూరవరం

14 . 7 . 1942

మీ కాదంబరి సమగ్రముగా ఆస్వాదించితిని. దాన మత్తు
కలుగకపోఁగా సంతోషము కలిగినది. బాణుని కాదంబరీ
సముద్రము నీఁక మన తెలుఁగువా రొక గ్రుక్కలోఁ గ్రోలఁ
గలరు. ఇందులకు మిమ్ములను నేను శ్లాఘింప కూరకుండఁ
జాలను.

కవికోకిల

జి. జాషువ గారు . వినుకొండ

20 . 4 . 1942

సంస్కృత వాఙ్మయమున కింపుసేయు మణిభూష ణమైన
కాదంబరి నలఁతియలఁతి తెలుఁగుపలుకుల కులుకుల వెలువరించిన
మీ ప్రతిభ స్తవనీయము. ప్రధానకథ నుచితములగు వర్ణ
నములతో నాంధ్రీకరించి, తెలుఁగుయోష నలంకరించిన మీ
యుపకృతి మఱువరానిది.

గంగవంటి ధార, తీయని శయ్య, ముద్దారు నర్థపుష్టి గల్గి
మీ కవిత ముచ్చట లూరుచున్నది.

అత్యంత జయశీలమై, మధువు లొలుకు మీ కలమునకు
ధన్యవాదములు.

కవిభూషణ

రాయప్రోలు సుబ్బారావు గారు

సికింద్రాబాద

28 . 3 . 1942

బాణుఁడు నవరస తంత్ర ధు
రీణుఁడు చతురప్రసన్న రీతికలా పా
రీణుఁడు శుకలీలాముఖ
రీణముఁ గాదంబరిన్ వరించెను కృతికిన్

తరళాతితరళ పదములు
సరళాధిక సరళపంక్తి సంధులు, విరళా
విరళ రసోదయ వాచా
చరణఝళంఝళలు అతని సంస్కృత శయ్యల్

తెనుగుం బంగరు వాకిం
డ్లను కొంగులు విప్పి పఱచినాడవు, తన్మో
హాన చిత్రాంబర లీలా
వను లానందమున మురిసిపడ గోపాలా!

ప్రభుత్వాంధ్రానువాదకులు

**వెదురుమూడి వేంకటకృష్ణరావు గారు . తిరుపతి**

**27 . 5 . 1942**

శ్రీ అడ్దేపల్లి నాగగోపాల కవిన రేణ్యుల 'కాదంబరి' ని గాంచి పులకితగాత్రుఁడ నైతిని. ఒకపరి చదువ నారంభించినఁ బూర్తి యగువరకు గ్రంథమును విడువ మనసొప్పదు. ఇంత మృదు మధుర ద్రాక్షాపాకమున నొప్పు పద్యరూపక మగు కథ నే నిటీవల నెచ్చటను జదివినది లేదు. ఈ కవి యింకను బహు స్వతంత్ర కావ్యరచనాధురీణుఁడై వాఙ్మయ ప్రపంచమున 'ఆంధ్రబాణు' డను నమరయశమునుగాంచి చిరాయురారోగ్య సంపదల నలరారునట్లు శ్రీపరమేశ్వరుఁ డనుగ్రహించుగాక!

**మంగిపూడి వేంకటశర్మ గారు . పిప్పర**

**29 . 10 . 1942**

మీరు పంపిన కాదంబరీ సంగ్రహము చదివి ఆనందించినాను. సులభమై మృదువై సరసమైన మీ యీ గ్రంథము శైలి చూచిన వారెవరును అనువాద మింత యొప్పునే యని యరు దందక మానరు. ఇంత చిన్నతనమునందే యింతటి కవితాప్రజ్ఞ యలవడుట పూర్వపుణ్యాఫలసంపద యనక తప్పదు. మీ రింకను ననేకకృతులు రచించి తెనుగుబాస నలంకరించి తెలుగుతల్లి నలరింతురుగాక !

కవిరాజు, శతావధాని

త్రిపురనేని రామస్వామి చౌదరి గారు, తెనాలి

26. 2. 1942

మీ రంపిన కాదంబరి కృతిని సాంగముగాఁ జదివి సంతోష పడితిని. శైలి చాల పేశలముగా నున్నది. దూరాన్వయములు క్లిష్టాన్వయములు లేక హృదయంగమమై యొప్పుచున్నది. ఇట్టి జాను తెనుఁగులో కృతులను వ్రాయువారు నేఁ డరుదుగ నుందురని తలంచుచుంటిని.

కవిసమ్రాట్

విశ్వనాథ సత్యనారాయణ గారు, బెజవాడ

19. 4. 1942

శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావుగారు సుప్రసిద్ధ కవులు. సంపన్న గృహస్థులు. వీరు చేసెడి భాషాసేవ నిర్వ్యాజము.

సంస్కృతమునఁ గాదంబరియుఁ దెనుగునఁ గళాపూర్ణోదయమును గహనములు. వానిలోని కథ ప్రసన్నత సమకూరునట్లు వ్రాయుట దాని కదే మంచిపని. అందులోఁ గవిరచన మృదుమధురమై నాతికఠినమై ప్రపంచింపఁ జేయుట మరీ మేలు సేఁత.

నాగగోపాలరావు రచన మధురమైన దనుట నిర్వివాదము. కాదంబరిని ఇట్లు పఠితృ ప్రసన్న కథాకముగాఁ జేయుటకు వీరు ప్రశంసనీయులు.

ఉమర్ అలీషా గారు

పిఠాపురము

3 . 6 . 1942

బాణుని కాదంబరి పౌ
రాణికము మహాప్రబంధరాజము మఱి గీ
ర్వాణమున కలంకారము
తూణీరము వాణి సర్వతోముఖ మగుటన్

ఆ కాదంబరి తెలుఁగున
శ్రీకల్యాణప్రసిద్ధి సేకూర రస
ప్రాకటముగ రచియించె ద
దాకృతి గోపాలరాయఁ డార్యులు వొగడన్

ఇది రసోచిత దివ్య భవ్యోడితార్థ
భావములచేతఁ జెలగు ప్రబంధ మగుట
తెలుఁగువారికి నింపుసొంపులు ఘటించు
ప్రాతక్రొత్తలు కలఁబోయు పట్టులందు.

సాహిత్యవిద్యాప్రవీణ

బులుసు వేంకటరమణయ్య గారు . మద్రాసు

1 . 10 . 1952

సంస్కృత వాఙ్మయమున అంతే కాదు భారతీయ వాఙ్మయమునం గల గద్యకావ్యములలో 'కాదంబరి'కిం గల స్థానమున్నతము. తర్వాత వెలువడిన పెక్కు భాషలలోని పెక్కు గ్రంథములకు అయ్యది ఆధారమయినది. అందు స్పృశింపబడని వర్ణనలు లేవు, సూచింపంబడని కథా చమత్కృతి లేదు. గమనింపని వాగ్వైదగ్ధ్యము లేదు. వాడంబడని పదము లేదు. కావుననే 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' 'కాదంబరీ రసాస్వాదాదాహారోఽపి నరోచతే' అను నానుడులు వెలసినవి.

సుదీర్ఘమును పరమాద్భుతసన్నివేశ విలసితము నగు కథా వస్తువును గ్రహించి బాణమహాకవి కాదంబరిలోని పూర్వభాగమును మాత్రము రచించి దివంగతుండాయెను. అతని గ్రంథ భాగమునం గథాంశ మల్పము, వర్ణన లధికములు. తండ్రి మరణింపంగా అన్ని విధముల నతనితోం దులతూంగు పుత్రుండు భూషణభట్టు ఉత్తరభాగమును రచించి ఎట్టి యఱకొఱలు లేకుండ గ్రంథమును పూర్తిచేసి తండ్రి సంకల్పమును నెఱవేర్చెను. తండ్రికింగల ప్రతిభయుం, గవితాసామర్థ్యమును తనకు లేవని భూషణమహాకవి తెలిపినను, పాఠకులకు గ్రంథమంతయు నేకకర్తృకమైనట్లే స్ఫురించును.

ఈ గ్రంథము నెడఁగల గౌరవమున నృసింహకవి దీనిని సంస్కృ
తమున 'కాదంబరీ కల్యాణ' మను నాటకముగా వెలయిం
చెను. వామనభట్టు కాదంబరిలోని రచనాపద్ధతిని, వర్ణనము
లను మేలుబంతులుగాఁ గైకొని బాణుని యనుకరించు జాడలలోనే
'వేమభూపాల చరిత్రము'ను రచించెను. శ్రీనాథాదులగు
ఆంధ్రమహాకవులు శివరాత్రి మాహాత్మ్యాదులలో కాదంబరి
ననుసరించియే కొన్ని వర్ణనలు సాగించిరి. సూరనార్యుని
'కళాపూర్ణోదయము'న కిది యాధారము.

మూలమునందలి యభిప్రాయములను, చమత్కృతులను అను
వాదములందును, అనుకరణములందును వ్యక్తపఱచుట మిక్కిలి
కష్టము. ఇట్లు గద్యమును గద్యముగను, పద్యకావ్యమును పద్య
కావ్యముగను అనువాదమొనర్చినపుడు సల్లడికాని మూల
భావములు వేఱొకరీతినున్న అనువాదములందు విశదములు
కాకున్నవి. సంస్కృత శాకుంతలాదుల యాంధ్రానువాదము
లీ విషయమునఁ దార్కాణలు.

తొలుతనుండియు సంస్కృత కావ్యములను అనగా గద్య
పద్యరూపముల ద్వివిధములైనవానిని తెలుఁగున పద్యకావ్య
ములుగనే మార్చుట సరిపాటియైనది. ఇందులకు కేతన
'దశకుమారచరిత్ర', జక్కన 'విక్రమార్కచరిత్ర', వెంకట
నాథుని 'పంచతంత్రము' మున్నగునవి ఉదాహరణములు.
బాణుని కాదంబరియు నీ విధముననే బృహద్గ్రంథముగా ఆంధ్రీ
కరింపబడియున్నది. దాని నిదివఱకు శ్రీ వావిళ్ళ సంస్థవారు
ప్రకటించియున్నారు.

కాదంబరి యుద్గ్రంథ మగుటచే గీర్వాణవాణి యెడ నెక్కువ
ఆదరము, అభినివేశము కలవారు కూడ దానిని పూర్తిగా
చదువుట యరుదు ; విశ్వ విద్యాలయములలోని ఉత్తమ పరీక్ష
లకుఁగూడ అందలి యొక భాగము మాత్రము పాఠ్యభాగ
ముగ నిర్ణయింపబడుచుండును. విద్యార్థులకయి జరిగిన గద్యా
నువాదములు కూడ పూర్వభాగ మాత్రమునకే కానవచ్చు
చున్నవి. శ్రీ వావిళ్ళవారి పద్యకాదంబరియు ఇప్పు డలభ్యము.
ఎక్కడనేని అది లభ్యమై యున్నను మూలముకంటెను రెం
డంతలు పెద్దదగు నా కావ్యమును జదివి, కథను గ్రహించు
నోపిక యుండుట మిక్కిలి యరుదు.

ఈ యంశములను గమనించియే కాబోలు శ్రీ నాగగోపాలరావు
గారు మున్నూరింటికిఁ దక్కువ సంఖ్యగల పద్యములలో
కాదంబరీ కథను సులభముగను సంగ్రహముగను బ్రకటించి
సంస్కృతాంధ్ర భాషా వాఙ్మయ నిష్ణాతుల ప్రశస్తులను బొంద
గలిగిరి. వివిధ విశ్వ విద్యాలయముల యామోదమును వడసి
యీ గ్రంథము పఠనీయముగ నిర్ణయింపబడినది.

శ్రీ నాగగోపాలరావుగారి పద్య 'కాదంబరి' నవ్యసాహిత్యములో
ఉన్నతస్థానము బొందఁదగినది. ఇయ్యది ప్రాచీన లాక్షణికమార్గ
ము నతిక్రమింపక క్రొత్తపోకడలఁ బోవుచు, క్రొత్తపాతలకు మేళ
వింపు కలిగించుచు, భిన్నదృక్పథముల వారి యాదరామోదము
లను బొందుచు, సంగ్రహకావ్యములకు తలమానిక మనఁదగినది.
పద్యరచనలో కృతికర్త కలము నిరాఘాటముగ సాగినది.
పొల్లు పదములు లేక మధురభావములు వానియంత అవి

## THE HINDU

## March 20, 1960

KADAMBARI : by A. Naga Gopala Rao, Fourth Edn.

Extricated from the labyrinths of laboured and lengthy descriptions of Bana, the story of Kadambari is narrated in about 1,000 lines with admirable skill and simplicity. The volume of opinions which this book elicited speaks eloquently for its merit. The various Universities have done well by prescribing this as a text-book for the Inter and B. A. Examinations. The Printing and get-up are neat.

## Dr. G. V. SITAPATI

## May 8, 1960

I have read your Kadambari with great delight and I heartily congratulate you on your admirable success in translating the kernel of the original famous work of Bana in Sanskrit. Your Telugu verse exhibits your felicity of expression. You have, by the melody of your composition, justified the testimony of the foreign savants that Telugu is the Italian of the East.

BOOK NEWS
September, 1959

Kadambari is an excellent adaptation in Telugu verse of Bana's original in Sanskrit. The poems are of fine artistic quality and have been treated in a compact and lucid form. The author has practically ommitted the descriptive portions and condensed the work into about a thousand lines of poetry. The author does not eschew long-winded verse but he has kept it at a minimum and employed quick short lines with great effect. He has succeeded in retaining in his work the spirit of the illustrious original and this is indeed an achievement.

The young author is to be congratulated on his creditable performance. The got-up of the book is attractive.